# స్వర్ణగోపాల శతకము




రచన

## కవిగారు

(ఆకునూరు గోపాలకిషన్‌రావు)

విశ్వసాహితి

పోతుకూచి సరస్వతీ పీఠం

స్వర్ణగోపాల శతకము

రచయిత

కవిగారం

(ఆకునూరు గోపాలకిషన్ రావు)

ప్రతులకు :

'అమ్మ కృప',

97 వాసవీ కాలనీ, సికింద్రాబాదు - 500 015.

ఫోన్ 7747882

విశ్వసాహితి

పోతుకూచి సరస్వతీ పీఠం

6-3-195, న్యూబోయిగూడ

సికింద్రాబాదు - 500 003.

ఫోన్ : 7533177

మరియు

ప్రముఖ బుక్ స్టాల్సు

ముద్రణ

శ్రీ సాయిరత్న ప్రొసెస్

3-6-780/22, హిమాయత్ నగర్

హైదరాబాద్ - 500 029.

ఫోన్ : 7607900

టైప్‌సెటింగ్ :

శ్రీ ఉషోదయా గ్రాఫిక్స్

హెచ్.ఐ.జి. 4/4, బాగ్‌లింగంపల్లి

హైదరాబాద్ - 500 004.

ఫోన్ : 7665661

15 జూన్ 1997

వెల రూ. 25/-

# కృతజ్ఞతలు

లభై ఆరు సంవత్సరాల క్రితమే నా కవితా వ్యాసంగాన్నూహించి నన్ను 'కవిగారూ' చిన మేధావి నా పెద్ద మేనమామయ్య కీ॥ శే॥ దేవులపల్లి వెంకటేశ్వర రావు (దేవేరా)

తకం వ్రాయమని శాసించి సాధించిన నా శ్రీమతి, శ్రీమతి డా॥ ఆకునూరు కు,

అతివిలువైన తమ అభిప్రాయాలను కోరగానే బహుచక్కగా వ్రాసి పెట్టిన సాహితీ ు –

డా॥ పోతుకూచి సాంబశివరావుగారికి,

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారికి,

డా॥ ఎస్వీ రామారావు గారికి,

శ్రీ దేవులపల్లి సుదర్శనరావు (అన్నయ్య) గారికి,

విరత్న మాదాసు పిచ్చయ్యగారికి,

డా॥ ఆకునూరు స్వర్ణలతకు,

- అమితమైన ప్రోత్సాహ సహకారాలిచ్చిన అన్నయ్య కాని అన్నయ్య శ్రీ పాణుగుపాటి ర్తి గారికి,

అడిగినదే తడువుగా అంతటి జ్ఞానఖని, విద్యాధని ఆసీనుడైయున్న విజ్ఞాన కేంద్రమందే క లేకుండా అవ్యాజ ప్రేమతో ఏకబిగి క్షణాల్లో శతక ప్రతిలోని ముద్రారాక్షసాల క్కడ అనంత రాముడై సంహారం కావించిన పండిత, హితవరేణ్యులు మాన్యశ్రీ టి అనంత రామయ్యగారికి,

- అందంగా శతకాన్ని తీర్చిదిద్దుటకు సహకరించిన,

శ్రీ ఉషోదయా గ్రాఫిక్స్, అన్నపూర్ణా ఆఫ్‌సెట్ మరియు సాయిరత్న ప్రాసెస్ వారికి,

- నా హార్దిక కృతజ్ఞతలు.

– కవిగారు

# శతక మెందుకు వ్రాశాను

20-2-1995 నాడు శ్రీ సినారె గారి తెలుగు గజలు ''మౌనరణం'' నుండి సాహితీ జన్మ నెత్తిన నేను ఆరోజుల్లో ఆయనగారి గజళ్లు ఇంగ్లీషు ఉరుదూలలోనికి అనువాదం చేయడమే గాక నాతొలి కవితా సంకలనం ''కవిగారి స్వగతాలు''కు రచనలు చేస్తున్న రోజులవి. అందులో నావారంపరిపై నా అభిప్రాయాలు కవిత్వీకరిస్తున్న తరుణం. వాటిలో చాలా వరకు తన గురించే ఉన్నా బహుశః అవి నచ్చకనేమో నా అర్ధాంగి నా దృష్టి నటునుండి మళ్లించడానికా అన్నట్లు 16.4.95 నాడు ఈ పిచ్చికవిత్వాలకు బదులు ఓ శతకం వ్రాయుమంది. ఆమాట నాలోని కవిని కదిలించినట్లు తోచి ఆశువుగా ఇప్పుడే స్వర్ణగోపాల శతకము మొదలెడుతున్నాని చెప్పి క్షణంలో మకుటం నిర్ణయించాను. కాని ఇక్కడో చిన్న మెలికొచ్చి పడింది. స్వర్ణలత తన పేరు. గోపాలకిషన్‌రావు నా పేరు. కనుక స్వర్ణగోపాల శతకమన్నాను కాని మకుటం ఛందోబద్ధ మవాలంటే, 'స్వర్ణగోపాలా' అని కదా ఉండాలి. అణుకువ లేనివాడు వంగలేని శవంలాంటి వాడని శతకంలో ఓ చోట వ్రాశాను. ఆ అణుకువనే నేను మకుటంలోనే చూపి 'గోపాల' నుండి 'గోపాల' కావలసి వచ్చింది. ఈ విధంగా నేను కాస్త తగ్గి నా శ్రీమతితో అనుసంధించాల్సి వచ్చింది. అదీ గొప్ప విలువే కదా? ఆలూమగలూ పాలునీరు బండిచక్రాలలా కలిసి పోవాలన్న మన పూర్వుల ఆలోచననూ ఈ విధంగా సార్థకం చేసిన వాణ్ణయాను. ఈనా కాస్త తగ్గడంతో 'స్వర్ణ' 'గోపాల' అను రెండు పదాలను రసాయనికంగా (సాహిత్య పరంగానే కాక) గూడా ఏకీకరణ చేసినట్లయి రెండూ ఒకే పదమయి 'స్వర్ణగోపాల' అను నూత్న పదము నాణెపరచబడి (Coined by me) మకుట పదబంధం దోషదూఅమవకుండా దోషదూరమై నట్లేనని పండిత మిత్రులు ప్రయాస పడకుండుటకే యీ చిన్ని వివరణ. ఇదే విధంగా కందం ఛందం విషయంలో గూడా స్వేచ్ఛాభావమే నా మతం, గమన సౌలభ్యమే నా ధ్యేయం. వారం రోజులలో శతకం పూర్తి చేస్తానని మొదలెట్టినాను. అది దాదాపు ఉదయం పదిగంటల సమయం. నాకో పరీక్షలా ఛాలెంజ్ చేసినట్లు అనిపించింది. ఎందుకంటే శతక విలువల ఆధారంగా తను పిహెచ్.డి. చేసింది. నేను మాత్రం ఆ విలువలపైనే శతకమెందుకు వ్రాయకూడ దనిపించింది. ఓనూరు మానవీయ విలువలు మదిలో మెదలడమూ, కాగితం పైనుండి కలం తీయకుండా 108 గీతముల ఈ శతక ప్రహసనం 17.4.95 ఉదయం కల్లా దైవికంగా పూర్తిచేసి తనకు చూపించడం జరిగింది. ఇందులో ఏదో గొప్పతనముందని కాని ఇదీ ఓ గొప్ప శతకమని చెప్పడం కాని నా

# అంకితము



వేమన బోంట్ల పొత్తునకు వెళ్ల దలంచను దీనివల్ల నే
నేమి ధనంబొ ఏ రకపు కీర్తినొ కోరియొ వ్రాయలేదు నా
స్వామిని కోర్కె దీర్చుటకె చప్పున ఈ శతకంబు వ్రాసి నే
నామెకె అంకితమ్మిడుదు నన్కొని నట్టి విధాయకమ్మునన్!

వత్సల నిన్ను నన్ను భగవానుడు కల్పిన నాటి నుండియున్
సత్సమయంబుగా మనసు సాక్షిగ నమ్మిన వాడ నేను నీ
తత్సమభావమేమొ మది దానినెరుంగ, షష్ఠి పూర్తి సం
వత్సర మందు ఈ శతక వాహిక గైకొని సంతసించుమా!

నీ జన్మ దినము నాడిది
నీ జటిల విద్య గుర్తుగ నేనర్పింతున్
ఈ జన్మ కన్న మిక్కిలి
పై జన్మల సంతసించు భాగ్యమునిమ్మా!

శతకములో నేవ్రాసిన
శతాధిక విలువలన్నియు
శ్రద్ధగ నేనూ
శత శాతము పాటిస్తూ
ఇతరులకూ విన్నవింతు
ఇంగిత మెసగన్!

— కవిగారు

ఇది ఎలా పుట్టింది దీని వెనక కథేంటి అన్న అపూర్వ రీతి మీకెరింగించడమే

ానో ఆనందించి తనెరింగించిన సదభిప్రాయంలోని నాల్గు వాక్యాలు మీకై క్రింద
్నాను

ను ఇలలో యదార్థముగ చూపుటకు మీరు చేసిన మొనరణ ముత్తమము''

మీ కవితా హోరుకు
మీ భావాల జోరుకు
మీ అర్ధాంగి హారతి
మీ ఈ వ్యాసంగమునకు !

్యాలు వ్రాసింది అర్ధాంగి. ఆమెలో అర్ధాంగి సరస్వతి. అరలో అరపావేకదా
తే పావైతేనేం ? మంచి ఎప్పుడూ తక్కువే కదా దొరికేది? అందుకే
ంచి మరీ క్షణకాలం
ు మాత్రం చిరకాలం' అని వ్రాసుకున్నానో చోట ఓ పాటలో!

చ్చి కవిత్వాలన్న వాటన్నిటినీ నా తొలిపుస్తకము ''కవిగారి స్వగతాలు'' గా
ా॥ సినారె గారు **30.11.96** నాడు, తరువాతటి నా మలి పుస్తకం 'కవిగారి
ు' ప్రజాకవి శ్రీ కాళోజీగారు **6-4-97** నాడు ఓరుగల్లులోను ఆవిష్కరించి
్వదించినారు. నేను స్థాపించిన 'పోతుకూచి సరస్వతీ పీఠం' కూడా నాడే
విష్కరించారు. ఈ శతకము నా మూడవ సాహితీ బుడతడు. నిజ జీవితంలో
, ఒక కొడుకుతో శాంతింప చేసుకొన్న బ్రహ్మ విద్యను సరస్వతీ విద్యలో
ట్టలేను. రెండు డజన్లు పైగా ఇప్పటికే పుస్తకశాలు తూణీరంలో ఉండడం.
కూడప్పుడే సంధించడం జరిగింది.

ి శతక రచయిత లెందరో మహానీయులు. వారితో పొత్తునకు బోవుట నా
మాత్రం కాదు. ఈ నూరు విలువలలో ఏ ఒక్కటి ఏ ఒక్కరు ఆమోదించి
జన్మ సార్థకమైనట్లే! అందుకే దీన్ని పాఠక దేవుళ్ల చేతుల్లో పదిల పరచడం.

- కవిగారు

# స్వర్ణం పొందిన గోపాలకవి

కవిగారు, ఆకుసూరు గోపాల కిషన్‌రావు, స్వర్ణ గోపాల శతకం వ్రాశారు గోపాల నామం మకుటంలో ఉంది. ఇది భక్తి శతకం అనుకోవచ్చు. చదవని పాఠకులు కాని ఇది నీతి శతకం, సూక్తి శతకం' ఒక విధంగా రక్తి శతకం.

భార్యాభర్తల అన్యోన్యతలు ఆధారంగా యీ శతకం పునాది వేసుకుంది. భార్య భర్తను అనేక విధాల ఆదేశిస్తుంది. కాని శతకం వ్రాయమని పూర్వ చక్రవర్తులు తమ ఆస్థాన కవులకు చెప్పినట్లు ఆదేశించడం అపూర్వం. ఇద్దరికీ సాహిత్య పిపాస వారధి. అందుకే ఈ ఆదేశం.

కవిగారు కాలం పాటించి శతకం పూర్తి చేశారు. సాధారణంగా కవికి ఇది కష్టం. అనుకున్న కాలంలో రచనలు పూర్తి చేయలేరు. ఆ విధంగా కవిగారికి ధీశక్తి, క్రమ శిక్షణా శక్తి, దీక్షాశక్తి వున్నందుకు అభినందనీయులు.

ఈ శతకం భార్య స్వర్ణలతకు అంకితం. భార్య అంటేనే భర్తలో అర్ధభాగం - అర్ధాంగి అంటారు. అర్ధాంగి అయిన భార్యకు ఒక శతకం అంకితం యివ్వడం సముచితం. తద్వారా కవిగారు తనకు తానూ అంకిత మిచ్చుకున్న వారయ్యారు అపూర్వ రీతిలో.

అనేక అంశాలు ఈ శతకంలో చోటు చేసుకున్నాయి. క్రమశిక్షణ, ఆత్మస్తుతి, న్యాయం, పని, కష్టము, మోసము, పట్టుదల, విశ్రాంతి, ప్రగతి, తప్పు - ఇలా ఎన్నో విషయాలపై కవి గారు తమ భావాలను వ్యక్తీకరించారు. ఆయన నిజాయితీ, ఆచరణ శక్తి కలవారు. అందుకే యీ రచనలు అనుభవ మాణిక్యాలు. కవిగారు వేంకటేశ్వర భక్తులని మొదటి పద్యంలోనే తెలుస్తోంది. పూర్వ కవులు తమ ఇష్టదైవాల ప్రార్థన చేసి కాని కవితలు వ్రాశారు. కవిగారు కూడా ఇలా ప్రార్థన చేసి వేంకటేశ్వరుని కృపతో ఒక రోజులో శతకం పూర్తి చేయడం ముదావహం.

శతకాలు ఆధునిక కవులు చాలా మంది వ్రాశారు. అయితే అందరూ కందంలో వ్రాయలేదు. కందం సులభం కాకపోయినా ధారావాహికంగా వ్రాసిన కవిగారు అభినందనీయులు. మంచి పద్యాలు పూర్వ సాహిత్యంలో కందంలో కనిపిస్తాయి. తిక్కన కంద పద్య రచనా ప్రతిభా సంపూర్ణుడు. కందం బాగా వ్రాయకల్గిన వ్యక్తి పరిపూర్ణ వ్యక్తిగా చెప్పుకోవచ్చు. అందుకే ఈయనకు కవిగారు బిరుదు చిన్నతనంలోనే లభించింది! దాన్ని సార్థకం చేసుకున్నారు కవిగారు.

ఈ శతకం తెలుగు సాహిత్య లోకాన్ని బాగా అలరించగలదని నా ఆశ. పండితుల మెప్పు పొందునని ఆకాంక్ష.

కళాప్రపూర్ణ
డా॥ పోతుకూచి సాంబశివరావు

14-5-97
6-3-195, న్యూబోయిగూడ,
సికింద్రాబాదు - 3

# స్వర్ణగోపాల పతకం

'స్వర్ణ గోపాల శతకం' పేరు వినంగానే స్వర్ణ అనే పట్టణంలో వెలసిన వేణుగోపాలస్వామి మీద వ్రాసిన శతకమేమో అని మొదట అనిపిస్తుంది. అసలు కథ వింటే ఆశ్చర్యం వేస్తుంది. 'స్వర్ణ' భార్యపేరు యొక్క ముద్ర. 'గోపాల' శతక రచయిత అయిన స్వర్ణ భర్తకు సూచిక య్యైన ముద్ర. సతీపతుల అద్వైత ప్రణయ జీవితానికి సహజమైన సాహితీ సంకేతం ఈ శతక మకుటం. 'కందం' పల్లకీలాంటిది. అందులో ఇమడాలంటే గోపాలుడు సైతం తలవంచి కాస్త లఘువు కావలసి వచ్చింది. అందుకే కాబోలు స్వర్ణగోపాలా అని ఉండవలసిన మకుటం 'స్వర్ణ గొపాలా' అయింది .

ఆమె మాట ఆయన తలఒగ్గి కాకపోయినా మనసొగ్గి అయినా తప్పక వింటాడు. ఆ సుగుణమే ఈ శతకావతారానికి మూలకారణం. శతకం వ్రాసిన కవి భారతికి మకుటం పెట్టే కవి అని ఆమెకు తెలుసు. అందువల్ల శతకం వ్రాసి కవితకు గౌరవం కలిగించుకోమని ప్రబోధించారు 'స్వర్ణ' గారు.

భార్యమీద కవిత చెప్పే 'కవిగారి'ని భారతి వైపు మళ్లించిన సాధ్వీమతల్లి 'స్వర్ణ'. కవిగారిని ఎటు తిప్పినా 'స్వర్ణ'ను మరిచే మాటే లేదు. 'స్వర్ణ'ను మకుటంలో ఇమిడించి దాన్ని బంగారం చేశారు. ఆమె మకుటాన్నే కాదు కవిగారిని కూడా బంగారం చేసింది. స్వర్ణ గోపాల శతకం నిజానికి స్వర్ణగోపాల పతకం!

కాంతా సమ్మితంగా బోధించి కవిత్వం పతిచేత వ్రాయించటం ఎలాగో తెలిసిన నిపుణు రాలు శ్రీమతి 'స్వర్ణ'. ఆమె జీవిత సహధర్మచారిణి కావటం కవిగారి అదృష్టం! విశేషమేమంటే ప్రేరణనిచ్చింది ఆమె; మకుటానికి మాన్యత నిచ్చింది ఆమె; శతకానికి వస్తువు నిచ్చింది ఆమె. ఆమె మాట కాదనలేని కవిగారు శతకాన్ని ఎలాగైనా వ్రాయాలనుకొని ఉత్తేజితులయ్యారు; మకుటాన్ని కొన్ని క్షణాల్లోనే కుదిరించుకున్నారు. వస్తువేదా అని పరికించారు. స్వర్ణగారు చేసిన పరిశోధనాంశాలు 'మానవ మూల్యాలు' (Human Values) ఎదుట నిలిచాయి. ఒక్కొక్క మూల్యాన్ని లేదా విలువను ఒక్కొక్క పద్యంగా చెప్పాలని భావించారు. వృత్తాన్ని కందంగా నిర్ణయించుకున్నారు. వస్తువు కొట్టిన పిండి కావటంతో కందాలుగా వండటం తేలికైపోయింది. ఇది భక్తి శతకం కాలేదు; రక్తి శతకం కావచ్చు కాని కాదలంచుకోలేదు; ఆమె అభిమతం మేరకు ఇది సూక్తి శతకమై అవతరించింది. కందంలో సూక్తి చెపితే తెలుగు వారికెంతో అభిమానం, ఆనందం. అందువల్ల మాకందంవంటి కందం సూక్తి శతకానికి అందమైన ఛందంగా జాలువారింది.

కవిత్వం నాలుగు రకాలని పెద్దలు చెప్పారు. ఆశు, విస్తర, మధుర, చిత్ర కవితలవి.

వాటిలో అతివేగంగా చెప్పే కవిత ఆశువు. గడియలో కావ్యం చెప్పి గండ పెండేరాలూ, కనకాభిషేకాలూ పొందిన కవులనూ, కవయిత్రులనూ దక్షిణాంధ్ర యుగంలో చూస్తాం. ఈ రోజుల్లో కూడా అలాంటి వారున్నారని కవిగారు శతకం చెప్పి చూపించారు. దాదాపు 20 గంటల్లో చెప్పిన శతకమిది. అయితే ఇది ఆశుపద్య కవిత కాదేమో! ఆశు రచన!

అందర్నీ ఆకర్షించే మరో మంచి గుణం వ్యావహారిక భాషా ప్రయోగం. పద్యాలను వ్యావహారిక భాషలో వ్రాసే యత్నాలు గిడుగువారి కాలం నించీ జరుగుతూనే వున్నాయి. ఈ మధ్యకాలంలో కంద పద్యాన్ని పద్య కవితలో మినీఫారంగా గుర్తించి దానిని వ్యావహారిక భాషా రచనలో వెలయించే ప్రయోగాలు కొందరు చేస్తున్నారు. అందుల్లో శతక ప్రయోగాలు కూడా ఉన్నాయి. కవిగారి 'స్వర్ణగోపాల శతకం' ఆ కోవకు చెందిందని చెప్పవచ్చు.

శతకంలో విలువైన విలువలు చెప్పబడ్డాయి కాబట్టి తాత్పర్య దృక్పథంలో ఇందులోని ప్రతిపద్యమూ హృద్యంగానే ఉంటుందని వేరే చెప్పవలసిన అవసరం లేదు. అందులోనూ కవిగారికి ధారబాగా ఉండటంతో రచన ధారాళంగా సాగింది. మచ్చు కొకటి రెండు కందాలు

''నీ మనసును నిర్మలముగ
కామక్రోధాదులందు కాలిడకుండా
నీమంబుగ కాపాడుము
నీ మనువది ధన్యమగును స్వర్ణగోపాలా!''

''లేమి విసుగు దుర్గుణాలు
ఈ మూడు శాపాలే యెటులంటారా?
తాము మనల దహించును
ఏమీ సుఖమీయకుండ స్వర్ణగోపాలా !''

వేమనలాగా కవిగారు కూడా మకుటాన్ని ఆత్మ సంబుద్ధిగా నిలపటం విశేషం. సామాన్యంగా తత్త్వవేత్తలు చేసే పని అది. కవిగారు తాత్త్విక రంగంలో కూడా కవిత్వం సాగిస్తారేమో చూడాలి !

ఎన్నో వెలుగు కిరణాలున్న చంద్రునికి కూడా కొన్ని మచ్చలుండక తప్పనట్లే ఎంతటి గొప్పకవి వ్రాసినా ఏవో కొన్ని పరిమితులుండకపోవు. ఈ శతకంలో గ్రాంథికం కుదిరినంత సహజంగా వ్యావహారిక భాష అమరలేదేమో! వేగంగా పూర్తి చేయాలన్న మనసులోని ఉరవడి లేకపోతే పద్యరచన మరికొంత చిక్కంగా ఉండేదేమో! అయినా, ఇది ఒక ప్రయోగం. ఈ ప్రయోగం వెనుకనున్న సతీపతులకు సహృదయాభినందనలు !

హైదరాబాదు
15-5-1997

- జి.వి. సుబ్రహ్మణ్యం

# సజీవ కవితా స్రవంతి

కవిగారి 'స్వగతాలు', 'సందర్భ స్వరాలు' తర్వాత ముచ్చటగా మూడో కృతి వారి ఈ 'స్వర్ణ గోపాల శతకం'.

కలాన్ని చేబట్టిన తెలుగు కవికి శతక రచన చేయకపోతే నిండుతనం లేదు. ఆ నిండు దనం ఈ కృతిలో ద్యోతకమవుతున్నది.

మానిని కోరికపై మానవీయ విలువల ప్రబోధానికి పూనుకొన్న కవిగారు ఆ స్వామినికే ఈ శతకాన్ని అంకితం చేయటం చరితార్థకం.

దినదినం అంతరించిపోతున్న మన ముఖ్యనిధులైన మానవతా విలువలపై కవిగారు తమ దృష్టిని సారించటం నవతరానికి మార్గదర్శకం కాగలదు. దేశభక్తి, జాతి గౌరవం, తల్లి దండ్రులు - పెద్దల పట్ల భక్తి - శ్రద్ధలు, తోబుట్టువులు - పిన్నలపై కరుణ కనుమరుగై పోతున్న సన్నివేశంలో వున్నాం మనం. అలాగని వ్యక్తి సంకుచితత్వాన్ని బోధించడం లేదు కవి. ఎల్లలులేని విశ్వాత్మగా రూపొందాలన్నదే ఆయన ఆకాంక్ష.

'ఉపకారము బరువుమిన్న' అంటూ ఉన్నంతలోనే ఆకొన్నవారికి ఉపకారం చేయాలంటాడు 'థెరెసా అమ్మలాగా' దీనజనావళి సేవ ధ్యేయం కావాలంటాడు.

కవిగారి హృదయం సుమకోమలం. ఆ సౌకుమార్యం. లాలిత్యం ఆయన శైలిని కూడా అంటి పెట్టుకొని వున్నాయి. ఛందో వ్యాకరణ నియమాలు పాటించక పోయినా నడకలో ఒక తూగు, అంతర్లయ గోచరమవుతాయి. సహజ సుందరమైన వ్యావహారిక శైలిలో కొనసాగిన ఈ కవితా రచనను మచ్చుకు చవి చూడండి -

పనిచేస్తూ పోతుంటే
పని సామర్థ్యం పెరుగుతుంది మా భేషుగ్గా
పనికి బద్ధకించావో
పని నీదై పోయినట్లై స్వర్ణగోపాలా !

నవ్వటమూ ఇతరుల
నవ్వించటమూ మన ఆశయాలు కావాలండీ
నవ్వుతూనె బ్రతకాలీ
నవ్వుతూ నవ్వుతూనె చావాలి స్వర్ణగోపాలా !

*యతి అగు వయసే తెంచిన తరుణంలో చతురకవిగా రూపొందిన కృతికర్తలో చక్కని నియతి గోచరిస్తుంది. 'క్రమ శిక్షణ కొలిమిలోన సామర్థ్యంగా మారు ధీశక్తి' వంటి ప్రౌఢోక్తులతో పాటు, పడతి లేక మనగలడా మగమహారాజు' వంటి చతురోక్తులూ ఈ శతకంలో చోటు చేసుకొన్నాయి.*

**''జీవితమోనది లాటి ది**
**జీవనదిగా సాగాలీ జీవితమెప్పుడూ''**

*అంటున్న కవిగారి కవితాధుని కవితా జీవనదిలా సాగుతూ వుండాలని ఆకాంక్ష*

- ఆచార్య ఎస్వీ రామారావు

6-3-23/2, న్యూబోయిగూడ
సికింద్రాబాదు - 500 080.
తేది 18 మే 1997

# స్వర్ణాంశాల శతకము

జీవితంలోని అత్యంత కీలకమైన, భోగభాగ్యాధికారాది సకల సంపదలన నుభవించదగు 58 సంవత్సరాలలో దీర్ఘకాలం విద్యుద్యంత్రాల మధ్య దాదాపు యాంత్రిక జీవనం ముప్పై ఆరు సంవత్సరాల పాటు గడిపి ఉద్యోగ విరమణ సమయ మాసన్న మయిన తరుణంలో సాహితీ వ్యాసంగం వైపు ఆకర్షితుడైన చి॥ గోపాలకిషన్ (కవిగారు), అనతి కాలంలోనే తమ భాషలలో హర్షించదగిన కృషి సల్పి దశాబ్దాల సాహిత్య చరిత్ర కలిగిన వారి వలె అనేకానేక ప్రక్రియలలో రచనలు చేస్తున్నందుకు నావరకు నేను గర్విస్తున్నాను.

కేవలం 24 గంటల కాలంలో ఒక శతకం అత్యున్నత విద్యా సంపన్నురాలైన తన సతీమణికి జన్మదిన కానుకగా యివ్వడానికి ఆమె పేరుతో తన పేరు జతపఱచుకొని ''స్వర్ణగోపాల'' మకుటంతో పూర్తి చేయుగలిగిన గోపాల కిషన్ శతాధిక పద్యాల వలనే శతాధిక గ్రంథాలు రచించి తన సాంకేతిక వృత్తిలో ప్రదర్శించిన అనన్య సామాన్య నైపుణ్యాన్ని సాహిత్య రంగంలో గూడా సాధించగలడన్న విశ్వాసం నాకున్నది.

శతకాలు సర్వసాధారణంగా నీతి ప్రబోధకాలు. ఈ శతకంలో నూరు మానవతా విలువలు పొదగబడడం హర్షణీయము. ఈ చిరంజీవునిలో గల వయస్సుకు మించిన పరిణతికి నేను ఆనందిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

మే డే 1997

అన్నయ్య
దేవులపల్లి సుదర్శనరావు

విశ్వమాతా సదన్
శ్రీనగర్ కాలనీ (ఉత్తర)
ఎన్ జి ఓస్ కాలనీ రోడ్
హన్మకొండ, వరంగల్ జిల్లా.

# అనురాగ రాగాలు

సాహితీ ప్రక్రియలన్నింటిలో శతకవాఙ్మయమే ప్రజలకు చాలా దగ్గరగా వెళ్లినది. వేలాది శతకాలు వ్రాయబడ్డా విశ్వజనీనత, స్పష్టత, సరళత్వము, ఆప్తవాక్కులు కల సుమతి, వేమన, దాశరథి, కృష్ణ మరియు భర్తృహరి శతకాల లాంటి వేళ్లపై లెక్కించదగినవి మాత్రం ప్రజల గుండెల్లో వేలాది యేండ్లుగా నిలిచి వారి నాలుకలపై ఆడుతున్నవి. ఇతర కవుల కన్న శతక కవులేకాక, శతక కవుల రచనలలో కూడా ఇతర రచనల కన్నా వారి శతక రచనలే బహుళంగా ప్రాచుర్యం పొంది మిన్నగా ఆదరించబడుతున్నవన్న అతిశయోక్తి కాదు.

మిత్రులు కవిగారు రచనా వ్యాసంగం ప్రారంభించి రెండు సంవత్సరాలే అయినా వివిధ ప్రక్రియలలో 22 పుస్తకాలు వ్రాసి అప్పుడే రెండు వెలయించారు. ఈ మూడవది ముచ్చటగా పై నుదహరించిన సర్వలక్షణ సమన్విత శతకము కావడము, అదీ కందపద్య భరితమవడము, అందును సమకాలీన సమాజంలో త్వరత్వరగా లోపిస్తున్న విలువల పునరుద్ధరణకు కావడం అత్యంత ముదావాహం. సహ ఇంజనీరుగా, ఆప్తమిత్రుడిగా కవిగారి ఈ ప్రయత్నాన్ని మిక్కిలిగా ఆనందిస్తున్నాను, అభినందిస్తున్నాను. ఈ విధంగా ఆయన శతక కవుల జాబితాలో చేరి ప్రాచుర్యం పొందుతారనడంలో నాకే విధమైన సందేహమూ లేదు.

మకుటంలో భార్యాభర్తల ఇద్దరి పేర్లను హృద్యంగా యిమిడించి, శతకం వ్రాయమని కోరిన శ్రీమతికే శతకాన్ని అంకితమివ్వడం కవిగారి సాహితీ పటిమ, విలువలపై ఆయనకున్న అంకిత భావం వరుసగా అందరికీ నచ్చి మెచ్చే విషయాలు.

ఇష్టదేవతా ప్రార్థనతో సంప్రదాయ బద్ధంగా మొదలైన శతకం శతాధిక మానవతా విలువల వజ్రాలతో పొదగబడిన 108 కందాల శతకం వ్రాసి కవిగారు భావితరాల వారికి భలే సూక్తి సుధలందించారు.

గంగా ఝరిలా, వీణియ సంగీతంలా సాగుతున్న కవిగారు కవితా సుందరిని ఆయన కలంగళం విప్పి అద్భుతంగా నర్తింప చేస్తోంది.

శతకంలో పద్యాలన్నీ హృద్యంగా సాగినవి. మచ్చుకు శతకావతరణంలోని రెండు పద్యాలు తిలకించండి.

శ్రీ తిరుమల వేంకటపతి<br>
ఆ తిరుపతి పద్మావతి ఆశీస్సులతో<br>
నే తలపెట్టిన శతకము<br>
వ్రాతునిదే మొదలుపెట్టి 'స్వర్ణగోపాలా' !

ఒక శక్తి సృష్టినడకను<br>
నికరముగా నిర్వహించు నీమముతోడన్<br>
'సకల బల' అట్టి శక్తికి<br>
సకలురము వంచవలె తల 'స్వర్ణగోపాలా' !

లోకాలన్నిటిని శాసిస్తున్న మహాశక్తుల యెడ భక్తిభావము కూడా గొప్ప విలువే కదా ?

ఎన్నో విశ్వజనీన నీతి సూక్తులతో సరళంగా, స్పష్టంగా, ఆప్తవచన మయంగా సాగిన ఈ శతకం ప్రజల హృదయాల్లో చోటు చేసుకొంటుదని వారి నాల్కలపై నర్తిస్తుందని, కవిగారి కవితా సుందరి విశ్వసుందరి అవాలని ఆశిద్దాం.

24.5.97<br>
శ్రీ సాయి అపార్ట్‌మెంట్స్<br>
సైదాబాదు, హైద్రాబాదు - 500 059.

కవిరత్న<br>
మాదాసు పిచ్చయ్య<br>
(రిటైర్డ్ ఎస్. ఇ. మార్కెటింగ్)

# స్వీకృతి భావము

''విశ్వశ్రేయః కావ్యమ్'' అనిలోకోక్తి. ఉత్తమ కావ్యములు జగత్కల్యాణ సాధనములు. సరససమంచిత కార్యసముచ్చయమే సాహిత్య మనబడును. కవి కర్మ కావ్యము.

మన తెలుగు సాహితీ క్షీరసముద్రములో ఉద్భవించిన ఆణిముత్యాలే శతకములు.

శతకములు వ్రాయుట క్లిష్టమైన ప్రక్రియ. ఇదివరలో కందము వ్రాసినవాడే కవి అన్న సంప్రదాయముండెడిది. కంద పద్యములు వ్రాయుట ప్రయాసతో కూడుకున్న పని. దానికి జటిల ఛందోనియమములు పాటించవలసి ఉండును. కాబట్టి మంచి కవిత్వాలు వెలువడాలని మన పూర్వులు ఈ నియమములు పెట్టినారు.

శతక రచనకు కూడా జటిల నియమములున్నవి.

1) మకుట నియమము
2) సంఖ్యా నియమము
3) ఛందో నియమము
4) వృత్త నియమము

కంద పద్యము వ్రాస్తేనే కవి అన్న నిబంధన ప్రకారమూ, శతక పద్యాలకున్న జటిల నియమాలను పాటించి (అతిరిక్తముల వదిలితే) కంద పద్యములలో శతకమును వ్రాసిన కవిగారు సార్థక నామధేయులని చెప్పక తప్పదు. వారికి నా సాహితీ జోహార్లు.

కవిగారు (శ్రీవారు) కలం పట్టి కాగితాలు నింపుతున్న రోజు నుండి, భావి భారత పౌరులైన పిల్లలకు సందేశాత్మకమైన, ఒక రచన చేయమని ఒక శతకమే వ్రాయరాదా అని అన్న మాట వాస్తవము. శతకము వ్రాస్తే పిల్లల సంపూర్ణమూర్తి మత్వ వికాసమునకు దోహదం చేస్తుందని అన్నాను. ఎంతో సదుద్దేశ్యముతోనే నేను కవిగారినీవిధంగా అభిలషించటం జరిగింది. వీరి రచన చాలామంది పదే పదే చదువుకునేట్లు వుండాలని, వీరి పేరు సాహితీ రంగంలో పది కాలాల పాటు నిలవాలని నా ఉద్దేశ్యము.

నా సంకల్పం సత్సంకల్పం కాబట్టి కవిగారు 24 గంటలలో కంద పద్యాలతో ఈ శతకాన్ని వ్రాశారు. ఈ శతకము తప్పనిసరిగా పాఠకుల ఆదరణ పొందుతుంది. కంద పద్యములతో కూడిన శతకము వెలువడాలంటే సామాన్య విషయం కాదు. వారి కవితలకు స్పందన నిచ్చి వాటిని వెలుగుబాటలో మళ్ళించాలనే సదుద్దేశ్యముతోనే శతకము వ్రాయమన్నాను. అందుకే ''ప్రతి పురుషుని విజయం వెనుక ఒక స్త్రీ వుంటుందని అంటారు''.

కవిగారు రెండు పద్మవ్యూహాలను ఛేదించుకుని విజయులై వచ్చిన అభిమన్యు-అతీతులు. ఒకటి కందపద్యములు వ్రాయడం, రెండవది వాటితో శతకము వ్రాయడం. ఇది సాహితీ లోకానికి కల్కితురాయి. 36 సంవత్సరాలు వేరేదో వృత్తిని నిష్ఠా దీక్షా దక్షతలతో నిర్వహించి కలం పట్టిన 55వ రోజునే ఒకే రోజు ఒక శతకం వ్రాయగల్గడం వల్ల ఆయన దీక్షా దక్షతలను మరొక్కసారి నిరూపించుకున్నారు.

ఈ ''స్వర్ణగోపాల శతకము'' పాఠకులను ఆబాలగోపాలమును రంజింప చేసి మానవీయ విలువలను గుర్తు చేస్తుంది. కవిగారికి దీనికిగాను సాహితీ కృతజ్ఞతలు తెలుపుకుంటూ వారు ఇంకా సమాజపు అవసరాలను గుర్తించి సామాజిక స్పృహ కలిగించు అంశాలపై తమ కవితా వ్యాసంగమును కొనసాగించాలని కోరుకుంటున్నాను.

ఈ శతకాన్ని నా జన్మదిన కానుకగా (15-6-97 నాడు) నాకు అంకిత మివ్వడం నిజంగా నా అదృష్టంగా భావిస్తున్నాను. ఆ సరస్వతీదేవి కరుణా కటాక్షం ఎల్లప్పుడూ యిలాగే మాపై ఉండాలని ప్రార్థిస్తూ.....


విద్యారత్న, ఉపాధ్యాయరత్న
బహుకళాకోవిద
డాక్టర్. ఆకునూరు స్వర్ణలత
M.A., M.Ed., Ph.D.

15-5-1997
'అమ్మకృప', 97 వాసవీ కాలనీ
సికింద్రాబాదు - 15.

# స్వర్ణ గోపాల శతకము

శ్రీతిరుమల వేంకటపతి
ఆ తిరుపతి పద్మావతి ఆశీస్సులతో
నే తలపెట్టిన శతకము
వ్రాతునిదే మొదలుపెట్టి 'స్వర్ణగోపాలా'!

ఈ రోజే స్వర్ణలతే
నే రాయాలి శతకమన నేసరి యంటిన్
నారాణి స్వర్ణ కోరిక
వారాంతము లోనె దీర్తు 'స్వర్ణగోపాలా' !

యతినగు వయసే తెంచెను
యతనము నే చేతునింక యతికావంగా
యతి గణ నియమాల్వదిలియు
చతురముగా అగుదుకవిని 'స్వర్ణగోపాలా' !

దిన దినము పతనమయ్యే
మన యందలి ముఖ్య నిధులు మన సంస్కృతులా
మానవతా విలువలపై
అనెదను నా ఈ శతకము 'స్వర్ణగోపాలా' !

ఆయమ కోరిక పైనే
వ్రాయగ బూనితిని కాక మకుటము లోనే
ఆయమ పేరును గూర్చితి
వ్రాయుదు నంకిత మామెకె 'స్వర్ణగోపాలా' !

విలువలు మన విధులు నిధులు
విలువలపై తను గ్రహించె పీహెచ్. డీ నే
విలువలు మనకవి రక్షలు
వలువలుగా మనల గాచు 'స్వర్ణగోపాలా'!

భువిలోన విలువ లెల్లను
అవి పూర్తిగ త్వరిత గతిని అడుగంటెనుగా
నవతర యువతీ యువకులు
శ్రమించుడు శ్రద్ధతోడ 'స్వర్ణగోపాలా'!

ఒక శక్తి సృష్టి నడకను
నికరముగా నిర్వహించు నీమము తోడన్
''సకలబల'' అట్టి శక్తికి
సకలురము వంచవలె తల 'స్వర్ణగోపాలా'!

మన భారత మాతృభూమి
మన కందరి కెల్లప్పుడు మనుగడ నిచ్చున్
మన దేశభక్తి ఒకటే
మన ఋణము దీర్చు దారది 'స్వర్ణగోపాలా' !

మన జాతి భారతజాతి
మన జాతి పైన గర్వం ఘనముగ ఉండీ
మన జాతి గౌరవం మన
మనసుల ఉండాలి నిండ 'స్వర్ణగోపాలా' !

మన మాతా పితలిద్దరు
మన ప్రాణ దేహ శక్తులు మనకిచ్చిరిగా
ఘనముగ గౌరవ భక్తులు
మనమిద్దరి కివ్వాలీ 'స్వర్ణగోపాలా' !

మనతోబుట్టువులందర
మనతో జీవించు చున్న ప్రాణుల నెల్లన్
మన మెప్పుడు కరుణ చూపగ
మన కబ్బును గాక శక్తి 'స్వర్ణగోపాలా' !

సంకుచిత భావముల విడి
అంకుర మొనరించుదా మనంత విశ్వాత్మల్
ఇంకించ వలెను ఎడముల
వంకర బుద్ధులను వీడి 'స్వర్ణగోపాలా' !

ఎవరవు నీవని అడిగిన
వివరము నీవీయు వలయు ''విశ్వాత్మ''నవీ
ఎవరీ ఎల్లలు పెట్టిరో
సవరింతము వానినెల్ల 'స్వర్ణగోపాలా' !

నీకున్నది అనుభవించ
నీకున్నది అధికారము నిజమే కానీ
నీకున్నంతటి లోననె
ఆకొన్న వారి కొసగుము 'స్వర్ణగోపాలా' !

దండలలో దారములా
అందమనకు ప్రేమ మనల అక్కున చేర్చున్
ఉండవలెను మనకుప్రేమ
దండిగ అందరి యందును 'స్వర్ణగోపాలా' !

అనురాగం ఎల్లరికీ
అనుదినమూ పంచిచూడు మది నీకెంతో
ఘనముగ సంతస మిచ్చును
మనసున కుల్లాసమిచ్చు 'స్వర్ణగోపాలా' !

నీ మనసును నిర్మలముగ
కామ క్రోధాదు లందు కాలిడ కుండా
నీ మంబుగ కాపాడుము
నీ మనువది ధన్యమగును 'స్వర్ణగోపాలా' !

కరుణ మనకు ఆదేవుడు
కరుణ కలిగి ఇచ్చినట్టి ఘన వరము కదా
కరుణను పంచియె నీవూ
కారుణ్యమూర్తి కావలె 'స్వర్ణగోపాలా' !

మంచితనము మించినట్టి
మంచి యొకటి వేరు లేదు మంచొకటె సదా
మించును సుగుణములనెల్ల
మంచికి మారయి మసలుము 'స్వర్ణగోపాలా' !

కర్తవ్యం ఏదైనను
కర్తవయిన నీవు దాన్ని ఖచ్చితముగ చెయ్
కర్తవ్యం కాదంటివా
ఆర్తి ఒకటె నీకు మిగులు 'స్వర్ణగోపాలా' !

కాలంలా ఖచ్చితముగ
సలిపితివో కర్తవ్యం సమనఃస్ఫూర్తిన్
నిలుచుకదా నీ పేరిల
కలిమి బలిమి రెండిటితో 'స్వర్ణగోపాలా' !

మానవసేవే మహితము
దీనజనావళి సేవల దేదీప్యంగా
మన థెరసా అమ్మలాగ
మనమంతా చేసేద్దాం 'స్వర్ణగోపాలా' !

అవసరమున తోడ్పడు, నీ
వెవరైనది చూడకుండ ఇదమిత్థంగా
అవసరమది నీకొస్తే
అవలి జనమె రావాలిగ 'స్వర్ణగోపాలా' !

నీ సాయము అర్థించిన
నీ సాటి జనుల మేలుకు నెరవేర్చాలే
ఏ సాయమొ నీవడిగిన
ఏ సామో నీకొనర్చు 'స్వర్ణగోపాలా' !

సాయము చేసిన వానికి
న్యాయమె విమర్శ హక్కది అటు కాదేనిన్
సాయము న్యాయము కాదది
న్యాయమునే అభిలషించు 'స్వర్ణగోపాలా' !

గెలుపును తెచ్చే దారులు
సులువవి కావుండుముళ్లు చూచెల్ల వలెన్
సులువే ఓటమి బాటలు
గెలుపె కదా ఆదర్శం 'స్వర్ణగోపాలా' !

ఇచ్చి పుచ్చుకో మర్యాద
ఇచ్చినదే నీకొచ్చు తిరిగి ఎల్లప్పుడునూ
ఖచ్చితమగు సత్యమిదే
తెచ్చుకొనకు నీ మీదకు 'స్వర్ణగోపాలా' !

దాతృత్వం తగిన దెపుడు
శత్రుత్వాన్నది దూరముంచు సాకల్యంగా
శత్రువులే లేక అజాత
శత్రువువైతే ధన్యము 'స్వర్ణగోపాలా' !

అణుకువ మనిషికి వరమది
అణుకువ లేనట్టి వాడు అజ్ఞత తోడన్
అణువంత వంగనప్పుడు
గణనకు శవమౌను కాదె 'స్వర్ణగోపాలా' !

బాధలు అందరి సొత్తులు
బాధలు లేకున్న మనము భాసించముగా
బాధలె ధైర్యం యిచ్చును
బాధలు భరించు నగుతూ 'స్వర్ణగోపాలా' !

కలిగి యుండు సత్ప్రవర్తన
కలిగి యుండు సౌశీల్యము కలగలుపులుగా
కలలోన కూడ నివియే
కలసి తెచ్చు మంచి ఖ్యాతి 'స్వర్ణగోపాలా' !

నేర్వాలని నీకుండిన
నేర్వగలవు ప్రతి ఒక్కటి నీకడ్డేదీ
నేర్వాలి దీక్ష తోడను
నేర్వగనేర్వ నిపుణతబ్బు 'స్వర్ణగోపాలా' !

ఉపకారమె ఒనరించుము
అపకారము మాట కూడా అనవద్దు సుమా
ఉపకారము పొందితివా
ఉపకారము బరువుమిన్న 'స్వర్ణగోపాలా' !

పూలదండ పడకముందె
తలనది వంచును కదా తాదాత్మ్యంగా
ఇలపై ఉపకార బలం
తెలిసినదా యిపుడైనా 'స్వర్ణగోపాలా' !

పంచుమెపుడు సంతసాన్ని
ఉంచుకొనుము నీలోనే ఉద్వేగాల్నీ
ఎంచుకొని ఎందరో యిది
మంచిగ పేరొందిరిగా 'స్వర్ణగోపాలా' !

నిప్పులాంటిదే కోపం
చప్పున దహించి వేయును చల్లపడకనే
చెప్పెద నేనిక మీరా
నిప్పు దరిని చేర్చవద్దు 'స్వర్ణగోపాలా' !

సత్యమెపుడు పలుకవలెను
సత్యాన్ని విడిచి పెట్టుట చచ్చిన తీరే
సత్య హరిశ్చంద్రుడు, గాంధీ,
సత్యముకే గీటురాళ్లు 'స్వర్ణగోపాలా' !

కలిగుండు నీవు సహనం
తెలుసు కదా ఆకవచం తేజమ్మైన వరం
కలిగుంటివేని సహనం
కలుగును అన్నీ జయములె 'స్వర్ణగోపాలా' !

కన్నీళ్లన్నీ కన్నీళ్లే
కన్నీళ్లే కంటివైన అవన్నియును నీ
కన్నీళ్లనియే తుడువుము
కన్నీళ్లుండొద్దు చూడు 'స్వర్ణగోపాలా' !

మనసును దాటిన మాటది
తను నాలుక చేరు నాల్కదాట నేమగునో
కనుకన్నీ వాలోచన
అనకయె చేయాలిసింది 'స్వర్ణగోపాలా' !

యౌవనమసలే నిందార్హం
యువకులార మీరంతా దక్షులుగా
ఎవరూ ఏనింద పడక
అవాలి ఆదర్శులెపుడు 'స్వర్ణగోపాలా' !

క్రమ శిక్షణ కొలిమిలోన
సామర్థ్యంగా మారు ధీ శక్తి సాహసులారా
క్రమశిక్షణ లేకుంటే
శ్రమ యంతా వృథాయౌను 'స్వర్ణగోపాలా' !

ఆత్మస్తుతి పరనిందా
ఆత్మతృప్తి లేని వార లాచరించునవే
ఆత్మ వంచనే అవి రెండూ
ఆత్మ కెట్టి సుఖముండదు 'స్వర్ణగోపాలా' !

పదవి పొగరు తలకెక్కిన
పదిలము లేదింక తనకు పాపాత్ముండై
మదమింక హెచ్చి ఆపై
పదవీచ్యుతుడౌను సుమ్మ 'స్వర్ణగోపాలా' !

తనపై తన అభిప్రాయము
తను దాచడమన్న కళను తామెరుగాలీ
తనపై నితరుల తలపే
ఘనమని ఎరుగుదురెందరు 'స్వర్ణగోపాలా' !

న్యాయం లేదే ఇలలో
న్యాయం చేయ్ ప్రతివారికి నీ నడతలలో
న్యాయాలు నత్తనడకలై అ
న్యాయాలే ఎదుగుచుండె 'స్వర్ణగోపాలా' !

ఆడా మగ తేడా లెందుకు
పడతి లేక మనగలడా మగమహరాజా
బడాయిలకు పోకుండా
పడతిని నీలాగ చూడు 'స్వర్ణగోపాలా' !

పని చేయుట మనిషి ధర్మం
పని లేకుండానే తిని కూర్చోగలడా
తినుటకు కావలె పనియే
కనుకనె పని తప్పదోయి 'స్వర్ణగోపాలా' !

పని చేస్తూ పోతుంటే
పని సామర్థ్యం పెరుగుతుంది మాభేషుగ్గా
పనికి బద్ధకించావో,
పనినీదైపోయినట్లె 'స్వర్ణగోపాలా' !

కష్టము చేయక తప్పదు
ఇష్టము నీకుండె నేని ఇల సుఖములపై
కష్టపడి చేయు పనులను
ఇష్టములవి తీరగలవు 'స్వర్ణగోపాలా' !

గడిచిన సమయము రాదిక
గడుచునపుడె దాన్ని గడన చేసుకో
గడుస్తున్న కాలం డబ్బును
కడు నిజమది తెలిసికొమ్ము 'స్వర్ణగోపాలా' !

మోసము కలియుగ ధర్మము
మోసము జరుగొచ్చు నీకు మూర్ఖులవలనన్
మోసము చేయుకు నీవే
మోసము వర్ధిల్ల నియుకు 'స్వర్ణగోపాలా' !

పట్టుదల ఉండవలయును
చుట్టూ ఎంతుందో పోటి చూస్తున్నావా
పట్టుదలతో పనిచేస్తేనే
తట్టుకోగలవు పోటీ 'స్వర్ణగోపాలా' !

చిత్తశుద్ధి యన్నది
ఉత్తమాట కాదు మహోన్నత భావం
చిత్త ముంచు శుద్ధిగాను
ఉత్తమముగ ఎదుగుతావు 'స్వర్ణగోపాలా' !

మనస్సాక్షి ఆత్మసాక్షి
మనకెంతో అవసరం మనరక్షలు రెండూ
మనకు మార్గదర్శకాలు
మన బ్రతుకుల చేయు ధన్యం 'స్వర్ణగోపాలా' !

విశ్రాంతిని వెదుక్కోప
రిశ్రమలోనే విను రిక్కించి చెవుల్
విశ్రాంతి ఎప్పుడనవాచీ
విశ్రమమనె 'టిక్'ల మధ్య 'స్వర్ణగోపాలా' !

గమ్యం నీవెరిగితివా
గమ్యమగును సులభం గమనం సౌలభ్యం
గమ్య మెరుగకున్న నీక
గమ్య గోచరమంతా 'స్వర్ణగోపాలా' !

ప్రగతి పథంలో నీవు
ప్రగతి చరుల ప్రయోజనాల మరచితివా
ప్రగతి కుంటు పడుటె కాక
ప్రగతి మారు దుర్గతిగా 'స్వర్ణగోపాలా' !

తప్పు చేయుటది నైజం
తప్పు అదే తిరిగి చేయ తప్పిదము మరీ,
తప్పు చేయకుండ వున్న
అప్పుడగును బ్రదుకు ధన్యం 'స్వర్ణగోపాలా' !

జనాభా పెరిగి పోయె
మానవత ఎంతగా కనుమరుగై పోయెన్
జనమీ విధి పెరిగినచో
మన బ్రదుకులు దుర్భరమగు 'స్వర్ణగోపాలా' !

నవ్వటమూ ఇతరుల
నవ్వించటమూ మన ఆశయాలు కావాలండీ
నవ్వుతూనె బ్రతకాలీ
నవ్వుతూ నవ్వుతూనె చావాలి 'స్వర్ణగోపాలా' !

పచ్చి నిజాలు కొన్ని మనం
ఖచ్చితముగా ఎదుర్కోకుంటే ఖలాసేలే
వచ్చి వెన్ను పోటు పొడుచు
ఖచ్చితముగ అవి యొకప్డు 'స్వర్ణగోపాలా' !

నిజాయితీ యన్నది
నిజంగా గొప్ప గుణం నీవాలోచిస్తే
నిజాయితీగ బ్రతకలేనని,
నిజాయితీ తప్పి చెడకు 'స్వర్ణగోపాలా' !

నిర్మలమగు పరిపాలనలో
ఖర్మకాలి 'పూర్తికాని ఫైళ్లు' కల్మషాలె లే
మర్మమింక చెప్పాలా ఏం
ధర్మం తప్పి ఆపబడ్డవని 'స్వర్ణగోపాలా' !

తప్పుడు దారులవెప్పుడు
ఒప్పుడు ఫలితాల నియమ్ము ఓపిక ఉంటే
ఒప్పుడు దారులె మనకె
ల్లప్పుడు తాతెచ్చు గెలుపు 'స్వర్ణగోపాలా' !

ఆత్మసాక్షి కుక్కమొరుగు
ఆత్మ చంపుకొని నీవు తప్పు చేసినప్పుడే
ఆత్మ అరుపు వినకుంటివో
ఆత్మ విడమ విన్వెంటనె 'స్వర్ణగోపాలా' !

నేటిని సద్వినియోగించు
నేటి దినము రేపును కాపాడు నంటారే
నేటి వలె రేపు నేడు కాదా
నేటిది రేపటిదీ నీ భారమె 'స్వర్ణగోపాలా' !

జూదము చాలా చెడ్డది
జూదానికి తోడైనది 'ఏడ్స్' మీకు తెలుసా
'జూదమూ' 'ఏడ్స్' రెండును
మందది లేని జబ్బులు కదా 'స్వర్ణగోపాలా' !

స్నేహమెంతొ తీపిదంట, తీపి
స్నేహములున్నాయా నేడు చూడాల్సిందే
స్నేహితులు మంచివారు ఆదర్శ
స్నేహితులు కలరంటావా 'స్వర్ణగోపాలా' !

విశ్వాసం అనగానే కుక్క గుర్తుకొచ్చు
విశ్వాసం ప్రతివానికి శ్వాసలాంటిదే కదా
విశ్వాసం లేనివాడు వెర్రివాడు
విశ్వాసం వున్నవాడు వెలుగుతాడు 'స్వర్ణగోపాలా' !

ఒకసారి పెళ్లి అది పవిత్రం
ఒకటి దాటి రెంటికొస్తే తప్పిదం దుర్భరం
ఒక్కటెక్కువై మూడైతే
చక్కటి మూర్ఖత్వం చావే శరణ్యం 'స్వర్ణగోపాలా' !

ఆకాశమగుపడునందంగా
ఆకాశం మీంచి చూడ ఆ దూరంనుండీ
ఆకాశంలా భూమీ
ఆకర్షణ కలిగి తోచు 'స్వర్ణగోపాలా' !

పెద్దమనిషిగా పుట్టుటలో
పెద్ద తనమే ముందది కాకతాళీయం
పెద్ద మనిషిగా చస్తేనే
పెద్దతనం గౌరవం పేరు 'స్వర్ణగోపాలా' !

పరుగెత్తే వారె కదా
పరులకన్న సమర్థులూ ప్రగతి మార్గదర్శకులూ
సిరులు కోరుకొన్నవారు
మరిజడులై మనగలరా 'స్వర్ణగోపాలా' !

తప్పుడు సలహాలిచ్చేడి
తప్పు జనాలనెల్ల తన్నాల్సిందే
తప్పును సమర్థించినా
తప్పు చేసినటులె యగును 'స్వర్ణగోపాలా' !

పాము కాటు వేయు మనిషి
పాము మంత్రమేయు బ్రతికె మా భేషుగ్గా
పామును మనిషి కాటువేయు
పామది చచ్చె నదాటున 'స్వర్ణగోపాలా' !

ఉత్సాహం తెచ్చిపెట్టు
ప్రోత్సాహం, పొరలు యువత నీలో
ఉత్సాహం చచ్చిందా యిక
తాత్సారం వచ్చిపడును 'స్వర్ణగోపాలా' !

ఆశాజీవి చూస్తాడు గులాబీనే, ని
రాశా జీవి కాంచు ముళ్ళనే అంటారు సదా
ఆశా జీవి అరగ్లాసు నిండయును, ని
రాశా జీవి అరగ్లాసు ఖాళీయుననే 'స్వర్ణగోపాలా' !

పదవిలోన వున్నప్పుడు
హృదయ లోచనాలతో చూడాలీ
పెదవి విప్పగానే నీవు
హృదయమె కదా మాట్లాడాలి 'స్వర్ణగోపాలా' !

అనాయాస బ్రదుకొద్దు
సునాయాస జీవితం కఠిన శ్రమా ఫలితం
అనాయాస మరణమే
మనకందరికీ కావలె 'స్వర్ణగోపాలా' !

లేమి విసుగు దుర్గుణాలు
ఈ మూడూ శాపాలే యెటులంటారా ?
తాము మనల దహించును
ఏమీ సుఖము లీయకుండ 'స్వర్ణగోపాలా' !

ఈర్ష్యా భయక్రోధములును
శీర్షములగు దుర్గుణాలు 'ఛీ' యనపాత్రుల్
హర్షణీయమవి వదిలిన
హర్షముగా బ్రదకవచ్చు 'స్వర్ణగోపాలా' !

ఒకటిగానె పుడతామంతా
కాకపోతె కొందరు బుద్ధివాడి దాటేస్తారందర్నీ
చకచకా పైకి రాగా వారు
ఇక ఇతరులు వింతగ చూస్తుంటారు 'స్వర్ణగోపాలా'!

ఇతరుల హక్కుల చెరుచుచు
సతతము తమ పబ్బములను గడిపే ధూర్తుల్
సుతరాము సుఖము నెరుగరు
హత మొందును వారి హజము 'స్వర్ణగోపాలా' !

ఇతరుల నమ్మిన వానిని
సుతరాము నమ్మరాదు సుంతయు నితరుల్
చతురుడు వాడే ఒకడా
ఇతరులు తినితా తక్కువ 'స్వర్ణగోపాలా' !

కాలినచో నీ వేళ్లవి
ఏల నిందింతువు నిప్పును ఏమది తప్పా
కాలుచుటె దాని నైజము
నీలోనే తప్పు కలదు 'స్వర్ణగోపాలా' !

పొగడ్తల కొనొచ్చు కాని
జగమున నసూయ నార్జించాల్సిందేగా
పొగడ్తలకు లొంగవద్దు
తెగడ్తలకు నీరవద్దు 'స్వర్ణగోపాలా' !

ఆశయాల ఆదర్శాల
ఆశ తీరు కొందరికే అలా అనీ మనం
ఆశయాల ఆదర్శాల
ఆశ వదులుకోవద్దు 'స్వర్ణగోపాలా' !

మంచి స్వభావమందరికీ
మంచి పేరు తెస్తుంది మనీషుల చేస్తుందీ
మంచి వాడుగా బ్రదకాలీ
మంచి వాడుగా చావాలీ 'స్వర్ణగోపాలా' !

దేవుని పూజించుట
దేవునినీ ప్రార్థించుట దివ్యమె గానీ
దేవుని సృష్టిని గ్రోలుట
దేవుని శక్తిని పొగడుటె 'స్వర్ణగోపాలా' !

మధుపానం అధికారం
మధురముగా అనుభవించు మాధుర్యాలే
విధిగా అవి గ్రోల గ్రోల
మధువై అవి తలకు నెక్కు 'స్వర్ణగోపాలా' !

మనసు బుద్ధి తప్పు తరిని
దాని నదుపు చేయుము తలకాయును వాడీ
మనసెంతో చపలమైంది
మనసుకు సంకెలలు వేయి 'స్వర్ణగోపాలా' !

సంగీతం సాహిత్యం
ఆంగికమౌ నృత్యానికి అవధుల్లేవే
నింగికి కూడా లేవా
భంగినె మనకొల్ల లొద్దు 'స్వర్ణగోపాలా' !

భయమున చేసిన సంధది
జయమును తాననుభవింప జాలదదెప్డూ
ప్రియమైన కత్తి తలపై
భయమే ప్రతి యొక్క క్షణము 'స్వర్ణగోపాలా' !

స్వాతంత్ర్యం తెచ్చు బాధ్యత
స్వాతంత్ర్యం కావాలెల్లరికీ సౌకల్యంగా
స్వాతంత్ర్యం తెచ్చే బాధ్యత నుండీ
స్వాతంత్ర్యం కోరనేల 'స్వర్ణగోపాలా' !

విజ్ఞానం తీర్చునజ్ఞానం
అజ్ఞానం ఓ శాపం అంధకారమే
విజ్ఞానం వాడుట విద్య చెప్పు
ప్రజ్ఞా పాటవాల ఖని విజ్ఞానం 'స్వర్ణగోపాలా' !

హింసా దౌర్జన్యాలూ
కంసుని అంశలు భీరుల కర్మలు కాదా
హింసకు విరుగుడు శాంతియె
కంసునికరి సౌభ్రాత్రం 'స్వర్ణగోపాలా' !

సోమరి పోతుల కిలలో
ఏ మాత్రము చోటులేదు ఏలాగన్నన్
ఏమీ ఈ యంత్ర యుగమున
తామాగిన బ్రతుక గలర 'స్వర్ణగోపాలా' !

దానగుణము లేకుండిన
హీనమగును బ్రతుకు గుండెజబ్బే యనుకో
దానకర్ణునాదర్శంగా
దాన ధనివై బ్రదకాలి 'స్వర్ణగోపాలా' !

ప్రార్థన ప్రత్యుత్తర రహితం
ప్రార్థన కుత్తరముండాల్సొస్తే కాదా
ప్రార్థన కార్యాలయు తంతు
ప్రార్థన కావలె నిష్కామము 'స్వర్ణగోపాలా' !

ఒక పరినొక్కొక పనినే
చకచకగా చేయ బూని చెసెయ్యాలీ
సుకమగు చేసెడి వారికి
సకల పనులు సులువౌనుర 'స్వర్ణగోపాలా'

జీవితమో నదిలాటిది
జీవనదిగా సాగాలీ జీవితమెప్డూ
జీవితాన్ని జీవించాలి
జీవితముననుభవించాలి 'స్వర్ణగోపాలా' !

తక్కువగా మాట్లాడుము
ఎక్కువగా వినుము నీవు ఏలంటావా
ఒక్కే నోరు రెండు చెవులను
చక్కగ మనకివ్వలేదె 'స్వర్ణగోపాలా' !

దుబారా చేయవద్దుదేన్నీ
దుబారా తెచ్చిపెట్టు దుఃఖాన్నే ఎప్డూ
దుబారా పొందలేవు దేన్నీ
దుబారా కుండుము దూరం 'స్వర్ణగోపాలా' !

అద్దమందు చూచు ముందు
బుద్ధిగ ఆలోచించు నీమూర్తి యేమిటో
అద్దమది చూపు నిజమునె
అద్దము చూసి 'హో' అనొద్దు 'స్వర్ణగోపాలా' !

చెడుచూడకు చెడువినకూ
చెడు మాటలెపుడు మాట్లాడకూ
చెడు చేయకు నీవెవరికి
చెడుకుండుము కడుదూరం 'స్వర్ణగోపాలా' !

వారములోనే శతకము
నేరాతునని తలంచి ఆరంభిస్తే
నా రాణి, వాణి దయతో
ఓ రోజుననే పూర్తియయ్యె 'స్వర్ణగోపాలా' !